# గీతావాణి

43




నాల్గవ సంవత్సరం  ఏడవ సంచిక.

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ గీతానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 జనవరి 1955

# విషయసూచిక.



## గీతాజయంతి గేయము

### రచన – శ్రీ కె. ఎం. రాజలక్ష్మమ్మగారు

★

(అదిగదిగో గగనసీమ - అనే వరుస)

పల్లవి॥ గీతజయంతి వచ్చెనోయీ! అందమైన తల్లిగీతా వచ్చెనోయీ!
మార్గశిర ఏకాదశి పర్వదినం పుట్టెనోయీ! భగవద్గీతా...!!

చరణం॥ భారతదేశ భాగ్యంబు గాంధితాత గానమిది, భక్తులకు జీవనంబు
ముక్తిమార్గ మిచ్చునది...॥గీ॥

2. ఆంధ్రదేశమంతటను నిండెనోయి! ఈ గీతా అందగాని ఆనందం
అంతటను నిండెనోయి...!! ॥గీ॥

3. మరువరాదు ఓ మనసా! గీతాగానం చేయాలి రాగాదుల తొల
గించర గీతజ్యోతి వెలగించర నీ హృదయపీఠమందు...!! ॥గీ॥

4. గీతాభక్తులందరికి జ్ఞానబోధ ఈ గీతా! రాజముదాసి హృదయాన
రంజిల్లు ఈ గీతా...!! ॥గీ॥



# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.





మేనేజింగ్ ఎడిటర్ :

శ్రీ రామకృష్ణ

★

మేనేజర్ :

స్వామి శ్రీ శివానంద,

గీతావాణి—ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4—0—0 * విడిపత్రిక 0—6—0

15th JANUARY 1955.

కవిత

# శ్రీ భగవద్గీతా సారము.

బాలకవి ఓ. నారాయణప్పగారు

## చతుర్దశాధ్యాయము – గుణత్రయవిభాగయోగము.

సీ॥ ప్రకృతి నాయోని తత్ప్రకృతికి బీజదాత
నగనేనందుచే నఖిలభూత
జాలముద్భవమొందు మూలప్రకృతియె మాత
తండ్రి నేనీభూతతతికి నరయ
సత్వంబు జ్ఞానమసంగంబు గల్పించు
రజము విషయాసక్తి రక్తిముంచు
మోహజాలంబున ముంచు దామసమది
శుద్ధసత్వమ్మున బుద్ధినిల్పి

గీ॥ నన్ను సద్భక్తిసేవించు నరుడు పరమ
పదము దప్పక బడయును పార్థ వినుము
అనెడి హరిపల్కులివి యని ఘనతదెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!

---



GOVERNMENT OF INDIA,
Vice-President's Secretariat, New Delhi.
2nd Dec. 1954.

*"My best wishes for Gitavani"*

2—12—54.

(S. Radhakrishnan)




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ – పుష్యమ్ ★ సంచిక 7

# సాధువాదములు.

మార్గశిర శుద్ధ ఏకాదశి శ్రీ గీతాజయంతి పర్వదినము. అయిదు వేల సంవత్సరముల క్రింద యిదే రోజున కురుక్షేత్ర రణ రంగమందు భగవద్గీత అవతరించినదని ప్రాజ్ఞులు చెప్పుదురు. ఈ పర్వదినమును యావద్భారతభూమియు మహాపవిత్రముగ తలంచి శ్రద్ధాభక్తి యుక్తముగ ఆచరించుచున్నది. జ్ఞానశాస్త్రమగు భగవద్గీతను ఆదరించుటలో తమ ఉత్సాహ ప్రోత్సాహములను కన్పఱచుచు ఆంధ్రప్రజ నానాటికి ముందంజ వేయుచున్నది. ఇది దేశమున కొక శుభసూచకము. ఆంధ్రభూమి నానా ముఖముల నుండి గీతాజయంతి మహోత్సవమును అపార భక్తిశ్రద్ధలతో తామాచరించినట్లు మాకు వార్తలు వచ్చినవి. ఆ విషయములు అన్యత్ర ప్రత్యేక పుటలలో ప్రకటించియున్నాము. ఆ పుణ్యాత్ములందరికి మా సాధువాదములు.

ద్వాపర యుగాంతమునాడు శ్రీకృష్ణావతారము సంభవించినది. ఆ మహనీయపురుషుడు యెన్నో మహత్కార్యముల నాచరించి

నాడు. కాని అవియన్నియు ఆనాటి ప్రపంచమునకు - నాటి సమకాలికులకుమాత్ర ముపయోగపడినవి. గీతోపదేశమె లేనిచో శ్రీకృష్ణావతారమువలన యీనాడు మనకెట్టి లాభసిద్ధియు నుండదు. గీత ప్రపంచమునకు భగవంతుడిచ్చిన శాశ్వత దానము. విశ్వమానవకోటికి నిత్యోపయోగి వస్తువు.

దుష్టశిక్షణమును - శిష్టరక్షణమును-ధర్మోద్ధరణమును భగవదవతారమువలన కలిగెడి ఫలములు. భగవద్గీతావతారమువలన కూడ మనకీనాడీ ఫలసిద్ధులు మూడును ఒడగూడవలసియున్నవి. గీతా ప్రచార విచారములవలన సద్వాసనలు వికసించవలెను. దుర్వాసనలు నశించవలెను. ధర్మమును గెలిపించి హృదయ సింహాసనమున ధర్మరాజును ప్రతిష్ఠింపవలెను. ధర్మదుందుభిని మ్రోగించి భగవంతు నెదుట బెట్టుకొని గాండీవ గుణటంకారముచేసి ఆసురీశక్తులను చీల్చి చెండాడెడి వీరనరోత్తములు కావలెను.

మెదడునకు బరువుదండగయైన శుష్కజ్ఞానము గాక కర్మక్షేత్రమున - క్రియారంగమున మూర్తీభవించి మిరుమిట్లు గొలుపు సజీవజ్ఞానము లోకమునకు అవసరమైయున్నది. అశోక ధర్మచక్ర ప్రభలు గగనవీధులలోనేగాక హృదయ వీధులలో సైతము ధళధళ మెరయవలసియున్నది. రాజకీయ స్వాతంత్ర్యముతోపాటు ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమును పొందినపుడే భారత జాతికి అభ్యుదయ నిశ్శ్రేయసములు - శ్రేయః ప్రేయములు జతపడి సమకూరుట. గీతామాత నారాధించి గీతాతత్త్వము నాలకించి గీతాజ్ఞానము నారగించి మన మా సుయోగమును పడయుదుము గాక!

జయ్ గీతామాతకీ!

జయ్ గీతాభక్తులకీ!!






( 1954 నవంబరునెల సంచిక 20_వ పుట తరువాయి )

జ్ఞానియొక్క సమగ్రకర్మములు నశించిపోవునని వెనుక చెప్పబడినది. ఆమాటపై ఈచోటనొక శంకకల్గుట కవకాశమున్నది. క్రియమాణమన బడు ఆగామికర్మము ఫలోత్పత్తిని కల్గింపక నాశముకాదు. అది ఫలము నిచ్చియేతీరును. "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి"— అని చెప్పినట్లు, ఫలానుభవమును పొందింపక కోటి కల్పములకైనను పుణ్యపాపకర్మములు నశింపవు గదా? యనెడి శంకకు సమాధానము చెప్పవలసియున్నది. బ్రహ్మసాక్షాత్కారమువలన కర్మకారణమగు అజ్ఞానమె నశించుటతో కర్మములకు నాశము తప్పనిసరియని భగవంతుడు నాల్గవ అధ్యాయము యిర్వదినాల్గవ శ్లోకమున ఆదేశించుచున్నాడు.

"అర్జునా! అర్పణము బ్రహ్మము. హవిస్సు బ్రహ్మము. బ్రహ్మమనెడి అగ్నియందు బ్రహ్మరూపుడగు కర్తవలననొనర్పబడు హోమం బ్రహ్మమే. ఆ హోమముద్వారా పడయు స్వర్గాదికములును బ్రహ్మమే. బ్రహ్మమునందు కర్మబుద్ధిగల పురుషుడు చెందెడి పదవిసైతముపరమానంద స్వరూపమగు బ్రహ్మమే."



కర్తయు కర్మమును క్రియయు కరణమును ఫలమును భోక్తయు సమస్తమును బ్రహ్మమే. ఈవిషయమునుగూర్చి వార్తికకారుడగు సురేశ్వరాచార్యుడీవిధమున చెప్పియున్నాడు.

"కారకవ్యవహారే హి
శుద్ధం వస్తు న వీక్ష్యతే।
శుద్ధే వస్తుని సిద్ధే చ
కారకవ్యాపృతిః కుతః॥"

శా॥ కర్తృకర్మాది కారకముల వ్యవహారమున్నచో శుద్ధవస్తువగు ఆత్మయొక్క అనుభవము సిద్ధింపదు. మరియు, శుద్ధవస్తువగు ఆత్మయొక్క సాక్షాత్కారము కల్గినచో ఆ కారకాదికముల వ్యవహారము సిద్ధింపదు.

జ్ఞానియొనర్చెడి కర్మములకును అజ్ఞానియొనర్చెడి కర్మములకును పోలికలేదు. గతసంగుడై ఫలమును కోరక కర్మముల నొనర్చెడి కర్మయోగికి ఫలానుభవలేపనములేదు. వానికర్మలకు ఈశ్వరప్రీతియె ఫలము. అదితప్ప జన్మాంతరముల నొసంగెడి ధర్మాధర్మరూపములగు కర్మబంధములులేవు. సమస్తమును బ్రహ్మమె యనెడి సర్వాత్మబుద్ధిని సంపాదించిన జ్ఞాని కర్మముల నొనర్చుచున్నట్లు మనదృష్టికి గోచరించినను నిజముగ నాతడు చేయుటలేదు. ఆ కర్మము అకర్మయేయగుచున్నది. అదంతయు అతనిదృష్టిలో బ్రహ్మముమాత్రమే. అతడు హవిస్సును సమర్పించుటకై ఉపయోగించెడి స్రుక్స్రువాదులు కూడ ఆతనిదృష్టియందు బ్రహ్మస్వరూపములే. హవిస్సుబ్రహ్మము. అగ్ని బ్రహ్మము. హోమమొనర్చెడి తాను బ్రహ్మము. పొందెడి గతియు బ్రహ్మమే. ఇట్లు ఆయన చేసెడి సమస్తమును బ్రహ్మమెగాని కర్మముకాదు. భ్రాంతివలన వెండిగ తోచునది తెలిసినచో ముత్తెపుచిప్పగ నున్నట్లు, భ్రాంతిసర్పము నిజముగ త్రాడుగనె యున్నట్లు, కర్మములని కారకములని ఫలమని మనము వ్యవహరించెడి వ్యవహారమంతయు జ్ఞానియొక్క దృష్టియందు అద్వితీయ బ్రహ్మమాత్రమైయున్నది. కాబట్టి అది జ్ఞానయజ్ఞమేకాని కర్మయజ్ఞముకాదు. అందువలన ఆతనికర్మము సమగ్రముగ లయమొంది బ్రహ్మభావమును బొందుచున్నవనుటలో నెట్టి దోషమునులేదు. చిత్రపటమునందు పిల్లియొకటి పాలుత్రాగుచున్నట్లు చిత్రించినచో "పిల్లి పాలు త్రాగుచున్న"దని వ్యవహరించుట యుండును. అయినను అంతమాత్రములో నిజముగ పిల్లి పాలు త్రాగుచున్నదని యెవ్వరూ భావింపజాలరు. ఆవిధముననే జ్ఞానియొక్క యజ్ఞమును యజ్ఞసామగ్రులును లోకసామాన్య భాషలో

వ్యవహరించుచున్నను పరమార్థ దృష్టి చేత అవి కర్మరూపములు కావు. అవి యజ్ఞసామగ్రులుకావు. స్వప్నమును స్వప్నపదార్థములును జాగ్రత్ జ్ఞానముచే బాధింపబడు జ్ఞానియొక్క అకర్త్రాత్మజ్ఞానముచే వ్యావహారిక లోకకర్మములు బాధింపబడును.

"ఓ అర్జునా! ఇతరులగు కర్మిజనులు దైవయజ్ఞమునె సర్వదా చేయుదురు. ఇతర తత్త్వవేత్తలు బ్రహ్మమనెడి అగ్నియందు ఆత్మను ఆత్మరూపముతో హోమము చేయుదురు."

ఇంద్రుడు అగ్ని వాయువు మొదలగు దేవతలను తృప్తికొలుపు కర్మములను దైవయజ్ఞములందురు. వీటినె దర్శపూర్ణమాస జ్యోతిష్టోమాది యజ్ఞములనికూడ చెప్పుదురు. బ్రహ్మదృష్టిలేని కర్మయోగులు ఆత్మశుద్ధికొరకు యజ్ఞకర్మపరాయణులై దేవతలను ఆరాధింతురు. ఈ యజ్ఞములద్వారా తమ గృహస్థధర్మమునకు ఉపకారములగు అన్న — వృష్టి — పశు పుత్రవిత్తాదికములను పొందుచున్నారు. మరియు చెప్పినచో చిత్తశుద్ధినిసహా సంపాదింపగల్గుదురు. గత శ్లోకమునందు చెప్పినట్లు కర్మయందుబ్రహ్మదృష్టికల్గి నిష్కామచిత్తమున కర్మముల నొనర్చువారు బ్రహ్మాగ్నియందు యజ్ఞముద్వారా యజ్ఞమును హోమముచేయుచున్నారు. సత్యజ్ఞాన అనంతానంద రూపమై సర్వవిశేషణ రహితమై యుండెడి తత్పదార్థ బ్రహ్మము తెలియబడినచో అయ్యది అగ్నివలె సర్వకర్మములను దహించి వేయగలదు. ఇట్టి అగ్నియందు తత్త్వజ్ఞానులగువారు త్వం పదార్థమగు ప్రత్యగాత్మను అభిన్న బ్రహ్మరూపమున హోమము చేయుదురు.

భగవంతుడీవిధమున ముఖ్య గౌణములనెడి రెండువిధములగు యజ్ఞములను చెప్పి తదనంతరము వేదమునందు శ్రేయస్సాధనములుగ ఎన్నివిధములగు శ్రేయస్సాధన యజ్ఞములు చెప్పబడినవో వాటిని క్రమముగ పేర్కొనుచున్నాడు.

"ఓ అర్జునా! మరికొందరు యింద్రియములను సంయమరూపమగు అగ్నియందు హోమము చేయుదురు. అట్లే మరికొందరు శబ్దాది విషయములను శ్రోత్రాది యింద్రియములనెడి అగ్నియందు హోమము జేయుచున్నారు."

యమనియమ ఆసన ప్రాణాయామములనెడి నాల్గింటి నభ్య

సించి కేవల ప్రత్యాహార పరాయణులైన కొందరు శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకమును వాటి వాటి శబ్దాది విషయములందు మరలించి సంయమమను నాబడు అగ్నియందు హావనము చేయుచున్నారు. యోగశాస్త్రమునందు "త్రయమేకత్ర సంయమః" అని పతంజలి చెప్పియున్నాడు. ధారణ ధ్యానసమాధులను మూడింటిని చేర్చి సంయమమందురు. హృదయము భ్రూమధ్యము మొదలగు ఆయాస్థానములయందు బహుకాల పర్యంతము మనస్సును స్థాపించుట ధారణ యందురు. ఇట్లు ధారణ యందు దృఢము చెందినచిత్తము విజాతీయవృత్తిరహితమై నిరంతర భగవదాకార సజాతీయవృత్తి ప్రవాహమును ధ్యానమని చెప్పుదురు. ధ్యాతృధ్యానములు తొలగి కేవల ధ్యేయస్వరూపము మాత్రము మిగిలియుండుట సమాధి యందురు. ఆసమాధి సంప్రజ్ఞాతమని అసంప్రజ్ఞాతమని భూమికాభేదమున రెండువిధములు.

చిత్తమునకు క్షిప్త మూఢ విక్షిప్త ఏకాగ్ర నిరుద్ధములనెడి ఐదుభూమికలు గలవు. అవస్థావిశేషములనె భూమిక లందురు. రాగద్వేషాదులకు వశమై విషయములందు అత్యంత అభినివేశముగల చిత్తభూమికను క్షిప్తమందురు. నిద్రతో బద్ధకముతో కునికిపాట్లతో కూడిన చిత్తమును మూఢమని చెప్పుదురు. చిత్తము నిరంతము విషయాసక్తమై యుండియు ఒకొక్కపరి దైవయోగమున ధ్యానమునందు స్థిరమైనచో ఆయవస్థను విక్షిప్తమందురు. ఈ భూమిక క్షిప్తావస్థ కంటె శ్రేష్ఠమైనది. క్షిప్తావస్థకాని మూఢావస్థకాని కల్గిన చిత్తమునకు సమాధిబొంద వీలు లేదు. విక్షిప్తావస్థగల చిత్తమునకు అకస్మాత్తుగ సమాధి సంభవింపగలదు. అయినను విక్షేప ప్రాధాన్యత యుండుటబట్టి దానిని యోగపక్షమందు చేర్చుట గల్గదు. గాలిచే దీప మారిపోవునట్లు విక్షేప ప్రాబల్యమున సమాధి నశించగలదు. ధారా వాహికమగు చిత్తవృత్తితో ఒకే వస్తువును విషయీకరించెడి సామర్థ్యమును ఏకాగ్రమందురు. ఆ భూమికయందు సత్త్వగుణము అభివృద్ధి చెందియుండును. తమోగుణ వికారములు క్షీణించియుండును. రజోగుణ చాంచల్యము సైతమడిగి యుండును. కావున ఆత్మాకార వృత్తి సంభవింప ననుకూలముండు

ను. అట్టి యెడ సంప్రజ్ఞాత సమాధి సిద్ధించును. ఆ సమాధియందు ధ్యేయాకారవృత్తి నిలిచియుండును. ఆధ్యేయాకారవృత్తి సైతము నిరోధింపబడినచో ఆయవస్థను "నిరుద్ధావస్థ" యందురు. ఆ నిరుద్ధచిత్తమునకు అసంప్రజ్ఞాత సమాధి సిద్ధింపగలదు. ఈ అసంప్రజ్ఞాతసమాధియే ధర్మమేఘమనుచు చెప్పబడి విరక్తుడగుయోగికి దృఢభూమికరై నెలకొనియుండును. ఇట్లు ధారణాది సంయమములు వివిధములై యుండుటబట్టి "సంయమాగ్నిషు" అనెడి బహువచన ప్రయోగమేర్పడినది.

ఇట్టి సంయమ రూపములగు అగ్నులయందు కొందరు అధికారులు శ్రోత్రాంద్రియములను హోమము జేయుచున్నారు. అనగా ధారణధ్యానసమాధులు మూడింటి సిద్ధికొరకు శ్రోత్రాదీంద్రియములను వాటివాటి విషయములందు ప్రత్యాహార మొనర్చుచున్నారని యర్థము.

స్వస్వ విషయములందు నిగ్రహింపబడిన యింద్రియములు చిత్తరూపమే అగుచున్నది. దీనినే శాస్త్రపరిభాషయందు ప్రత్యాహారమందురు. ఈ ప్రత్యాహారసిద్ధిని బొందిన చిత్తము వైశద్యము ధారణాదికములను సంపాదింప గల్గుచున్నది. ఈ విషయమందు ప్రత్యాహార ధారణధ్యాన సమాధులు నాల్గు యోగాంగములును సమావేశ మొనర్పబడినవి. సర్వేంద్రియజన్యములగు వృత్తులు సమాధ్యవస్థయందు నిరోధించుటను యజ్ఞమని చెప్పబడినది. వ్యుత్థానదశయందు రాగద్వేషరహితముగ శాస్త్రవిహితవిషయముల ననుభవించుటయు యజ్ఞమేనని భగవంతుడు చెప్పియున్నాడు. "ఓ అర్జునా! సమాధినుండి బహిర్ముఖుడైన యోగి శాస్త్రవిహితములగు శబ్దాది విషయభోగముల ననుభవించుచున్నను రాగద్వేషకళంకము లేదు. కావున నదియొక యజ్ఞమే. శ్రోత్రాదీంద్రియములనెడి అగ్నులయందు శబ్దాది విషయముల నాతడు హోమముచేయుచున్నాడు".

బ్రహ్మవాదుల మతము ననుసరించి భగవంతుడు ముందటి శ్లోకమునందు సమస్తసాధనములకు ఫలరూపమైనదియు, వ్యుత్థానదశలేని నిరోధ పూర్వకమైనదియు నగు సమాధియనెడి యజ్ఞమును చెప్పుచున్నాడు.

"ఓ అర్జునా! యజ్ఞాధికారులగు మరికొందరు సర్వేంద్రియకర్మములను ప్రాణక్రియలను జ్ఞానదీపిత

మగు ఆత్మ సంయమయోగమనెడి అగ్నియందు హోమ మొనర్చు చున్నారు."

సమాధి రెండువిధములు. లయ పూర్వక సమాధి యొకటి — బాధా పూర్వకసమాధి మరియొకటి. కారణమునకంటె కార్యమునకు వేరుగ అస్తిత్వములేదని తెలిసికొనుట లయ పూర్వకసమాధి. శ్రీవ్యాసభగవంతుడు బ్రహ్మసూత్రములలో "తదనన్యత్వమారంభణ శబ్దాదిభ్యః" అని యీ విషయమును గూర్చి చెప్పియున్నాడు. ఈదృష్టిననుసరించి చూచినచో, పంచీకృత పంచభూతముల రూపమగు వ్యష్టికార్యప్రపంచము, కారణరూపమగు సమష్టి విరాట్టునకంటె భిన్నముకాదు. సమష్టి పంచీకృత పంచ మహాభూతముల రూపమగు కార్యప్రపంచము అపంచీకృత పంచమహాభూతములయొక్క కార్యమగుటబట్టి ఆ కారణరూపమగు అపంచీకృత పంచ మహాభూతములకంటె భిన్నముగ లేదు.

మరియు, శబ్దస్పర్శరూపరస గంధములనెడి అయిదు గుణములతో కూడినపృథ్వి, శబ్దస్పర్శరూపరసములనెడి నాల్గుగుణములుగల జలము యొక్క కార్యమగుటబట్టి ఆ జలమునకంటె భిన్నముకాదు. నాల్గు గుణములుగల జలము, శబ్దస్పర్శ రూపములనెడి మూడు గుణములుగల అగ్నితత్త్వము యొక్క కార్యముకాబట్టి కారణమగు అగ్నికంటె కార్యమగు జలము భిన్నముకాదు. మూడుగుణములుగల అగ్నితత్త్వము శబ్దస్పర్శములనెడి రెండుగుణములుగల వాయువుయొక్క కార్యముకాబట్టి కారణమగు వాయువుకంటె భిన్నముకాదు. మరియు, ద్విగుణకమగు వాయువు శబ్దగుణకమగు ఆకాశముయొక్క కార్యముకాబట్టి కారణమగు ఆకాశముకంటె వాయువు భిన్నముకాదు. శబ్దగుణకమగు ఆకాశము, "ఏకోఽహం బహుస్యాం"— అనెడి పరమేశ్వరుని సృష్టిసంకల్పరూపమగు అహంకారముయొక్క కార్యమగుటచేత కారణమగుఅహంకారమునకంటె భిన్నము కాదు. ఆ అహంకారము, "తదైక్షత" యని శ్రుతిచెప్పినట్లు సృష్టి వీక్షణమనెడి మహత్తత్త్వము యొక్క కార్యమగుటబట్టి దానికంటె భిన్నముకాదు. అట్లే మహత్తత్త్వము మాయాపరిణామమగుటచే కారణమగు మాయకంటె కార్యమగు మహత్తత్త్వము భిన్నముకాదు. మాయ జడమగుటబట్టి

చైతన్యరూప బ్రహ్మము నందు అధ్యస్తమైనది. కావున నది చైతన్య బ్రహ్మమునకంటె భిన్నముగ లేదు.

ఇది లయపద్ధతి. కార్యమును కారణమందు లయింప జేయుచు కడకు కేవలచైతన్య బ్రహ్మమాత్రమునుమిగుల్చుట ఈ లయపూర్వక సమాధియొక్క క్రమము. ఈ సమాధియందు అధికారికి "తత్త్వమ" స్యాది వేదాంతమహావాక్యముల యొక్క అర్థజ్ఞానము లేకపోవుటబట్టి కార్యసహితమగు అవిద్య నశింప వీలులేదు. అనగా, లయ చింతన కాలమందును అవిద్యయుండునని యర్థము. అవిద్య మిగిలియుండుట బట్టి కార్యరూపమగు సంసారము వెండియు సంభవించుచున్నది. కాబట్టి ఈ లయపూర్వక సమాధి సుషుప్తితో సమమైనది కావున సబీజసమాధియని చెప్పుదురు.

ఇంకా, ౧౯

# గ్రంథ సమీక్ష

## 1. దృగ్దృశ్యవివేకము:—

ప్రకాశకులు: శ్రీ నిత్యానందస్వాములవారు. శ్రీ కైలాసాశ్రమము, ఉపనిషద్ విహార్ పోస్టు, కాళహస్తి మార్గం.

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులవారు వేదాంతానికి సంబంధించిన ప్రకరణ గ్రంథాలు చిన్నవి పెద్దవి ఎన్నో వ్రాశారు. వానిలో ఈ చిన్నిగ్రంథమురత్నములాంటిది. శ్రీ కైప శేషశాస్త్రి గారు రచించిన పద్యమూలీ గ్రంథములో మూలశ్లోకములతో పాటు జతపరుచబడినవి. గీతాప్రబోధ సంఘాధ్యక్షులు — త్యాగజీవులునైన శ్రీ నిత్యానంద స్వామివారు భక్తుల సహాయముతో ముద్రింపించి జిజ్ఞాసువులకు యీ జ్ఞాన ప్రసాదాన్ని పంచిపెట్టుచున్నారు. సరళ తాత్పర్యముకూడ చేర్చియున్నచో మరింత ఉపకరించియుండెడిది. శ్రీవారా ఉపకారమును సైత మచిరకాలముననే చేయుదురు గాక!

## 2. గీతోపదేశ హారము:— (భక్తినివేదన విశేషసంచిక) వెల తెలియదు.

ప్రకాశకులు:— శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘము, విజయవాడ—1.

గీతోపదేశ హారము గీతాభక్తులకు ఆప్యాయమానమగు ఉపాహారము. తమరీతి నీతులకు తగినట్లు గీతానూక్తిరత్నముల సేకరించి హృద్యములగు గద్యపద్య వ్యాసములతో ప్రకాశకులు వెలువరించియున్నారు.

# ★ గీతాప్రతిపాదిత భక్తివిశిష్టత. ★

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,

భగవద్గీతా గ్రంథమున షట్కత్రయములో మధ్యమణివలె భక్తిషట్కము విరాజిల్లుటవలననే భక్తియొక్క సర్వావభాసకత్వము సూచితమగుచున్నది. ఇటు కర్మకు జీవకమై యటుజ్ఞానమునకుద్దీపకమై స్వాయముగకూడ భగవత్సాన్నిధ్య ప్రాపకమై విరాజిల్లునది భక్తి. భక్తి విలసితముకాని శుష్క నిష్కామకర్మ సచ్చిదానంద ప్రాప్తికెన్నడును సాధనము కాజాలదు. మోక్షహేతువైన జ్ఞానము పరమేశ్వరానుగ్రహము లేకుండ లభ్యము కాజాలదు. కావున భక్తి దేహళీదీప న్యాయము చేత నుభయపార్శ్వములను తన ప్రాభవమును ప్రసరింప చేయుచున్నది. ఈ జన్మలో జ్ఞానోదయము కాకపోయినను సగుణ బ్రహ్మోపాసనము పరిపక్వమైనచో సాధకునకు చతుర్ముఖ బ్రహ్మలోక ప్రాప్తియు, క్రమముక్తియుం గల్గునను ఔపనిషద సిద్ధాన్తము. గీతాష్టమాధ్యాయమున సూచింపబడుటచే కూడ భక్తియొక్క కర్మజ్ఞాన మధ్యమత్వము సూచింపబడుచున్నది.

భగవద్గీత భక్తిని కర్మతోను, జ్ఞానముతోను మేళవింపచేసిన పద్ధతి మిక్కిలి విలక్షణమైనది. గీతకు పూర్వము వెలువడిన గ్రంథములలో ఈశ్వరార్పితమైన కర్మ చిత్తశుద్ధిని గల్గించి జ్ఞానమునకును మోక్షమునకును పరంపరా కారణమగునను విషయము అల్పాల్పముగ మాత్రమే వెల్లడింపబడియున్నది. ఈ విషయమును నొక్కి చెప్పుటచే పరమేశ్వర భక్తికిని కర్మకును గల సంబంధమును బ్రహ్మజ్ఞానోత్పత్తితో భక్తికి గల సంబంధమును నూతనపద్ధతిలో బోధించిన కీర్తి గీతకుదక్కినది. ఏదైనను సనాతనమైన ఉపనిషద్వాఙ్మయమునకు సమ్మతమైనదిగానే యుండవలయునుగాని తద్విరుద్ధమై యుండరాదుకదా! కావున గీత ప్రతిపాదించిన యీ నూతన సిద్ధాంతమున కుపనిషత్తులలో నాధార మెచ్చటనున్నదో విచారింపవలసియున్నది. బృహదారణ్యకోపనిషత్తులో "తమేతం బ్రాహ్మణా వివిదిషన్తి... యజ్ఞేన దానేన తపసాऽనాశకేన" అను స్థలములో నీ మార్గము సూచింపబడియున్నది. ఇచ్చటి యజ్ఞ దాన తపశ్శబ్దములు ముఖ్యముగా గుర్తింపదగినవి. భగవానుడీశబ్దములనే తీసికొని 18వ అధ్యాయములో ఉపసంహార సమయమున కర్మయోగమును విధించినాడు. "యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణాం"

భగవద్గీత యోగముతో భక్తికి కల్గించిన సంబంధముకూడ విశిష్టముగానున్నది. యోగసాధనచే శరీరముపై ఆధిపత్యము సంపాదించుకొనుటయు, మనస్సునకు నైర్మల్యమును కూర్చుకొనుటయు నెంత శ్లాఘింపదగినవిగానున్నను మనోనిగ్రహము నీశ్వరగ్రహణమునకు సాధనముగా యోగి యుపయోగించినపుడే నాకు ప్రియుడగునని భగవానుడు చెప్పుచున్నాడు:

**యోగినామపి సర్వేషాం**
**మద్గతేనాన్తరాత్మనా।**
**శ్రద్ధావాన్భజతే యో మాం**
**స మే యుక్తతమో మతః॥**

సగుణబ్రహ్మోపాసనమునకు యోగముప కరింపగల యుత్కృష్టరీతి యెనిమిదవ యధ్యాయమున సూచింపబడినది. ప్రయాణ సమయమున యోగాభ్యాస సహాయముచే పరమేశ్వరుని ధ్యానించుట ప్రశంసింప బడినది.

**ప్రయాణకాలే మనసాఽచలేన**
**భక్త్యా యుక్తో యోగబలేన చైవ**
**భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్య-**
**క్స తం పరం పురుషముపైతి దివ్యం।**

ఇదే రీతిగా సమస్త సాధనలకు భక్తిని ప్రాణముగా గీత వివరించుచున్నది. భక్తి సంపర్కముచే కర్మమార్గము పొందిన పరి మళ మునుకూడ కొంచె మూహించితము. భూస్వర్గలోకయాతాయాతయుత మైశ్వర్య సుఖమాత్ర ప్రదాతయగు కర్మమార్గము పర మేశ్వరార్పణ భావోద్దీపితమై నిత్యనిరతి శయానందాత్మక మైన మోక్షమును చేకూర్చ నగుటయే కాక స్వల్పవిషయములలోకూడ కర్మికి మహోపకారియగుచున్నది. కేవల కర్మనే నమ్మి కర్మ నాచరించువానికా కర్మ సాంతముకాక విలచిపోవుచో ప్రయోజన మ్మండదు. మరియుఁ కర్మలో లోపములు వచ్చుచో ఫలముండక పోవుటయే కాక విప రీత ఫలము, ప్రత్యవాయము వచ్చును. పర మేశ్వరునే నమ్మి, పరమేశ్వరప్రీతికై కర్మ నాచరించువానికి అశక్త్యాదులచేతను, మర ణాదులచేతను కర్మ సగములో విచ్ఛిన్న మైనను కర్మఫల ముండును; అంతియే కాదు. అట్టివానికి కర్మలో లోపములున్నను ప్రత్య వాయమురాదు. "నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే" మున్నగు స్థలము లలో శుష్క కర్మకును భక్తిభరిత కర్మకును భేదము స్పష్టపరుపబడినది. కర్మమిశ్రము, శుద్ధము, జ్ఞానమిశ్రము – అని భక్తి మూడు విధములుగ నుండవచ్చునని మధుసూదన సర స్వతి నిర్వచించియున్నాడు. ఈ మూడు విధములైన భక్తియుకూడ గీతలలో పరమా వధిలో కన్పట్టుట విశేషము. ప్రథమ షట్క ములో కర్మమిశ్రముగను, మధ్య షట్క ములో శుద్ధముగను, తృతీయ షట్కములో జ్ఞానమిశ్రముగను భక్తి కన్పట్టుచున్నది. గీతలో మొత్తముమీద ముఖ్యస్థానము నాక్రమించునది కర్మ భక్తి జ్ఞానములలో నేదియను ప్రశ్నకిందే సమాధాన మిమిడి యున్నది. ఏ రీతిగా భక్తి మిగిలిన రెండింటి తోను సంబంధించియున్నదో, అంత దట్ట ముగా మిగిలిన రెంటిలో నేదియు తక్కిన రెంటితో సంబంధించియుండలేదు. ఉదా హరణకు కర్మాచరణములో భక్తి యెంత యవశ్యముగా చెప్పబడినదో, భక్తికి కర్మ యంత ముఖ్యముగా చెప్పబడలేదు. నిత్య నైమిత్తిక కర్మానుష్ఠాన మెంతగా నవశ్యా చరణీయమైనను అది పరిమితమైనది; భక్తి వలె చుట్టికటికలు మూడువుని హృదయములో నసపాలుమను గానుండవలసినదికాదు. గీతలో విధింపబడిన భక్తిభావమన్ననో ప్రాణము వలె నిరంతరము మానవునిలో ప్రచలితము కావలసియున్నది. ద్వేష్టా సర్వభూతానాం

అనునది గీతకెంత సమ్మతమైనను ఆదేశాత్మకముగా గాని వర్ణనాత్మకముగా గాని యున్న అధిక సంఖ్యాక గీతా వచనములు భక్తిసంబంధము కలవేకాని జ్ఞానసంబంధము కలవి కావు. జ్ఞానసంబంధముగల వచనములు కూడ చాలవరకు భక్తిదార్ఢ్యాపాదకములే కాని కేవల జ్ఞానపరములు కావు. జ్ఞానము రెండు విధములని మన శాస్త్రకారులు చెప్పియున్నారు. (1) పరమేశ్వరశక్తి వైభవ సంబంధములైన యేయంశములను తెలిసికొనుటవలన భక్తిదృఢపడునో వానిజ్ఞానము (2) భక్తిచే నీశ్వరానుగ్రహము కలుగుటవలన నుదయించు నద్వైతభావము. గీతలో ప్రచురముగ మొదటిదానికి సంబంధించిన యంశములే కలవు. ఆ యంశములకుతోడుగ భక్తిని పెంపొందించుకొను సాధన విశేషములును ప్రతిపాదింపబడినవి. ఫలితముగా మాత్రమే జ్ఞానమును సూచించుచు నాచరణమునకు భక్తి నుపదేశించు శ్లోకములే గీతలో హెచ్చు. ఈశ్వరానుగ్రహము వలననే యద్వైతవాసన గల్గునను సిద్ధాంతములో ఈశ్వరానుగ్రహ సంపాదనమైననే దృష్టి హెచ్చుగా నుండవలయుననుట నిస్సందేహము. కైవల్యమునుగూర్చు సాక్షాత్సాధనమైన జ్ఞానమును నేనే కల్గింతునని భగవానుడు చెప్పిన యంశము నిట స్మరింపవలయును.

"దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాన్తి తే"
"భక్త్యా మామభిజానాతి
యావాన్యశ్చాస్మి తత్త్వతః"

మున్నగు వచనములన్నియు సముచితరీతిని సాధనకోటిలో భక్తికి గల ప్రాముఖ్యమును స్ఫుటము చేయుచున్నవి.

మందాధికారుల నుద్ధరించుటకు గీతలో భక్తి వైవిధ్యమును వివరించిన తెఱగు పేర్కొనదగినది. చిత్తశుద్ధికాని, నిష్కామకర్మాచరణాసక్తికాని, జ్ఞానముకాని లేని మందాధికారులు నాస్తికులు కాకుండ పరమేశ్వరాశ్రయమును ఆస్తిక్య భావముతో లౌకికలంపటత్వముతో నున్నను ఉన్నత మార్గముననున్న సాధకులు సంతసింతురు. ఆలంపటత్వ మధర్మమార్గమున నుండరాదను నది వేరుగ చెప్ప నక్కరలేదు. అట్టివారికి వాంఛాపూర్తికై యీశ్వరారాధనము చేయరాదనుటకంటె, వాంఛలణచుకొన వలయునని వేరుగను నిరంతరము పరమేశ్వరు నాశ్రయింపవలయునని వేరుగను చెప్పవలసిన యావశ్యకత కలదు. అట్లుకాక సకామముగ నీశ్వరు నారాధింపరాదని వారికి శ్రేష్ఠులు బోధించుచో అంతమాత్రముచే వారి కామములు నశింపవు సరికదా. వారికి గల యీశ్వరారాధనాభ్యాసముపోయి వీరు నాస్తికులై పరమేశ్వరునకు దూరులై పోవుదురు. వారి యాస్తిక్యము నభినందించుటయే మిక్కిలి యుచితమైన పద్ధతి. కావుననే భగవానుడు ఇతరస్థలములలో నిష్కామస్థితి నెంతగా విధించినను, అట్టివారి సకామారాధనము నభినందించి వారి యాస్తిక్యమున కుత్సాహమును కూర్చుచున్నాడు.

"చతుర్విధా భజన్తే మాం
జనాస్సుకృతినోఽర్జున।

ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ ॥
ఉదారాస్సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్."

మున్నగువాక్యములు గీతా గ్రంథమునకు సర్వజనీనతను కూర్చుచున్నవి. భక్తి విషయమై యిట్టి యభ్యనుజ్ఞలు లేనిచో గీత కతిపయోన్నతసాధకులకుమాత్రమే మార్గ

గీత భక్తికి శీల సంపత్తితో సంయోజనము గావించిన తెఱగుకూడ నత్యంతము ఔచిత్య విలసితమైయున్నది. "అనన్యాశ్చింతయంతో మాం" ఇత్యాది స్థలములలో భగవంతు నాశ్రయించినవానికి లోపముండదను భావము కన్పట్టుచున్నది. దీనినిబట్టి యాస్తిక్య విరోధులు కొందరు మతముపైననే అపవాదాలను వేయుట సంభవించుచున్నది. భగవంతుని సేవించినంత మాత్రమున నెట్టి పాపాత్ముడైనను మహానుభావుడేయని భగవద్గీతాదిగ్రంథములు చెప్పుచున్నవనియు, ఎన్నియో యసత్యములనాడి మోసముచేసి యకృత్యముల నాచరించి మహాపాపియైనవాడుకూడ నొకసారి దేవాలయములోనో, ఇంటివద్దనో దేవుని పూజించినంత మాత్రమున వీనిపాపములను భగవంతుడు సరకుచేయక వానిని దరిచేర్చుకొనునటే పవిత్రగ్రంథములు చెప్పుటచే లోకములో సచ్ఛీలమునకు తావులేకుండ పోవుచున్నదనియు నేడు చాలమంది తలచుచున్నారు. వారనుకొనునట్లు భక్తి సచ్ఛీలమునకు తిలాంజలి నర్పించునదేయగుచో గీతకు నేటి కాలముననే కాదు మరియే కాలముననుగూడ నింతప్రశస్తియుండెడిదికాదు. పాపులనుగూడ నుద్ధరింతునని భగవానుడు నుడివినమాట నిజమేకాని పాపులు పాపులుగా నుండగానే వారు నన్ను భజించినంత మాత్రమున వారికి మోక్షమిచ్చెదనని దీని యర్థము కాదు. నన్నాశ్రయించువారి పాపబుద్ధులను పోగొట్టి వారికి ధర్మబుద్ధులు పుట్టునట్లు చేసెదననియు, అట్లు ధర్మబుద్ధులైన పిమ్మట నేవారు నన్ను చేరుదురనియు భగవానుడు చెప్పుచున్నట్లు "అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్" అనుదాని వెంటనే "క్షిప్రం భవతి ధర్మాత్మా" అని యుండుట వలన స్పష్టమగుచున్నది' పాపి పాపిగానే భగవంతుని చేరజాలడనియు, తన పాపబుద్ధులను పోగొట్టవలసినదిగ భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించుచో భగవంతుడు వానిని మార్చుననియు నిటచెప్పుట వలన భక్తి సచ్ఛీలముయొక్క ప్రాధాన్యమును తగ్గించునను దుర్భావము పాఠకునకు పటాపంచలై పోవుటయేకాక తనలో నేదోషమున్నను దాని నణచుకొనుటకు తన ప్రయత్నము వ్యర్థమైనప్పుడు పరమేశ్వరుని శరణుజొచ్చి యాతనిమహిమచే నణచుకొనవచ్చునను నాశకలిగి ధర్మబుద్ధికిని భక్తిమార్గమునకును చక్కని సంయోగ మేర్పడుటకు అవకాశము గలుగును. ఇతరప్రయోజనములకువలెనే సచ్ఛీల సంపాదనమునకుకూడ పరమేశ్వరుని శరణుజొచ్చుట యవసరమని స్పష్టమగును. "తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత" "న మే భక్తః ప్రణశ్యతి" ఇత్యాద్యుపదేశములును ప్రతిజ్ఞలును మానవ హృదయమున కాశ్వాసహేతువులు మాత్రమేకాక సమస్తాధ్యాత్మిక శాస్త్రములకును సమ్మతములై నగ్నసత్యములై యలరారుచు కర్మ భక్తి జ్ఞానముల యాభాస వైషమ్యముల నడంచి సాధకులకును జిజ్ఞాసువులకును అమృతఘుటికలై యొప్పుచున్నవి.

ఆంధ్రదేశమున

ఉద్భట గీతాప్రచారకులు V

# శ్రీ బోధానందమహర్షులవారు

(కవికోకిల - కవితిలక N. V. శర్మగారు, మైలవరం, విజయవాడ.)

★

[శివైక్యసిద్ధినొందిన శ్రీ బోధానందమహర్షులవారు ఆంధ్రదేశమున గణుతికెక్కిన గీతాప్రచారకులు. గీతపై భావబోధమనెడి పేరుతో స్వసంవేద్యమనెడి పేరుతో తాత్పర్యములను రచించియున్నారు. కొలదికాలము క్రిందటనే భౌతిక దేహమునువీడిన వీరి పవిత్ర చరిత్రమును సంగ్రహముగ వ్రాసిపంపవలెనని కోరిన మా విజ్ఞప్తిని ఆదరించి శ్రీ నందివెలుగు వేంకటేశ్వరశర్మగారు ఈ వ్యాసమును పంపియున్నారు. వారికి మా కృతజ్ఞతా వందనములు. — సం॥]



పూర్వగోదావరి మండలమున రామచంద్రపురము తాలూకా యందలి 'కాలేరు' గ్రామ మీతని జన్మస్థానము. వృషనామ సంవత్సర కార్తీక శుద్ధ విదియ సోమవారమున విశాఖానక్షత్ర వృశ్చిక లగ్నమున జన్మించినాడు. తల్లిదండ్రులు పెట్టిన పేరు సుబ్బన్న శాస్త్రి. ఆదిశైవ ద్రావిడ

బ్రాహ్మణ శాఖకు చెందినవాడు. కాళ్లకూరు వంశస్థుడు. కౌశిక సగోత్రుడు. సూర్యనారాయణ లక్ష్మాంబల కుద్భవించిన పుత్ర రత్నము. శుభలక్షణాన్వితుడు. పూర్ణచంద్ర నిభాననుడు. స్ఫుర ద్రూపి. కులపతి యనదగు కేదార లింగదేశికుకడ వేదాగమముల కంఠస్థమొనర్చినాడు. ఆంధ్ర సంస్కృత విద్యలయందారితేరిన పండితుడు. జ్యోతిషమందును రుచి చూచినాడు. ఆగమశాస్త్ర మందందెవేసిన చేయి. నిరంతర శ్రీచక్రార్చన పరాయణుడు. సనాతన ధర్మమార్గ నిష్ఠాగరిష్ఠుడు. ఇంపైన కంఠస్వరము. సహస్ర రుద్రాక్షధారి. గోష్పాదమంత శిఖతో, మకరకుండలములతో పాముకుబుసమువంటి సన్నని మల్లు దోవతులతో కాశ్మీర శాలువతో పావుకోళ్లతో విభూతిరేఖలతో కుంకుమయులంది ప్రత్యక్ష రుద్రుని వలె ప్రత్యక్షమగువాడు. పుత్రు డొక్కడు పుత్రికలిద్దరు నుదయించి నారు. భార్యలిద్దరు అస్తమించి నారు. సంసారాశ్రమమందు విరక్తి వహించినాడు.

కృష్ణాతీరమున మట్టపల్లి గ్రామ మునగల నరసింహక్షేత్రమునందు శ్రీ శివానంద యతీంద్రుల సన్నిధానమున సన్న్యాస స్వీకారమంది "బోధానంద సరస్వతి" యనబర గెను. శ్రీవారు బదరీనాథ కేదార నాథ గంగోత్రి యమునోత్రి మున్నగు దివ్యస్థలములందు తప స్సమాధినిష్ఠల పూర్తిగావించి ఆసేతు శీతనగ పర్యంతము పర్య టించి గీతాప్రచారము లొనరించిన ధీరోదాత్తుడు అమ్మహనీయు వాక్యము లాగమ సూత్రములై మెట్టినచోటు పుణ్యముల మెట్టయై వసించినతావు బంగారు గుట్టయై యొప్పినది. ఆపాదమస్తకము భూతి నలంది వ్యాఘ్రచర్మమును ధరించి రుద్రాక్షమాలలనొప్పి ఆదిత్య ప్రతిబింబమోయన్నట్లు ప్రకాశించు వారు.

కాశీక్షేత్రమునందుగల మణి కర్ణికా ఘట్ట సమీప తారకామఠ మునందు బహుకాల నివాసులై రాజాదరణ పాత్రులై పండిత పామర రంజకముగ జ్ఞాన బోధ లొనరించెడివారు. శ్రీ జగద్గురు శ్రీకంఠ శివాచార్య విరచితంబైన బ్రహ్మసూత్రములకు శివార్కమణి దీపికకు సిద్ధాంత సారావళికి గీతా భాష్యమునకు ఆంధ్ర తాత్పర్య ములు విరచించి ముద్రింపించినారు.

శ్రీకంఠవిజయమను గ్రంథమునకు కృతిస్వామియైనారు. కోటి ఫలి విజయవాటికలందు శ్రీకంఠ విగ్రహము నెలకొలిపి, మఱియు విజయవాడలో బోధానంద ఋష్యాశ్రమ మొందు వెలయజేసినారు. భారత దేశమందెల్లెడల ఈయనకు వేన వేలుగ శిష్యులున్నారు. ఓంకార స్వామివారి శాంత్యాశ్రమమునకును రవీంద్రమహాశయుని శాంతినికేతన మునకును రమణాశ్రమ వ్యాసాశ్రమములకును శివగంగ మైసూరు జయపూరు పుంగనూరు బెంగుళూరు హైదరాబాదు మున్నగు సంస్థానములందు ఆహ్వానింపబడి శ్రీవారు తమ గీతామృత ధారలతో నోలలాడించి మహా సత్కారములబొంది గజారోహణాద్యుత్సవముల ననుభవించిరి. శృంగేరి పుష్పగిరి కామకోటి పీఠాధిపతులు శ్రీవారి ప్రచారమునకు పంత సించి సహాయము లొనరించి యుండిరి. శ్రీవారు తుదకు విజయవాడలో తాము నిర్మించిన శ్రీ బోధానందాశ్రమమునందు శ్రీ విజయనామ సంవత్సర వైశాఖ బహుళ అమావాస్య గురువాసరము నాడు బ్రహ్మనిర్వాణసిద్ధి పడసినారు. శ్రీవారి జీవితచరిత్ర ప్రబంధరూపమున త్వరలో వెలువడు ప్రయత్నములు కావింపబడు చున్నవి. వీరు ముక్తులు; అధ్యాత్మ స్వరూపులు; పూర్ణవస్తువు నెరింగిన బోధానందులు.

[ఆదిశైవ పత్రికాసంపాదకులు శ్రీ ఆగమిక పురుషోత్తమ గురుక్కల్ గారు పంపిన వ్యాసములోని అంశములుకూడ కొన్ని గ్రహింపబడినవి. — సం॥]

# గీతా వాణి

కం॥ చదివిన గీతావాణిని
మదిఁగల యజ్ఞానతమము మటుమాయమగుఁ
ఒదవును జ్ఞానము గనుకఁ
వదలక పఠియింపఁదగును బరమప్రీతిః

కోగంటి దుర్గామల్లికార్జునరావు,
భారతీసమితి.

# గీతాశయము.

శ్రీమతి శంకరమంచి చెంచులక్ష్మమ్మగారు, వేంపల్లి.



[వేంపల్లి పెంటం శెట్టి నారాయణ శ్రేష్ఠిగారి శ్రీ రామలింగేశ్వరస్వామివారి ఆలయంలో 12—11—54 నాడు జరిగిన వార్షికోత్సవ సందర్భంలో శ్రీమతి చెంచు లక్ష్మమ్మగారు చెప్పిన ఉపన్యాస సారాంశం. ఆమెగారే ఈ వ్యాసరూపంలో కూర్చి మా గీతావాణికి పంపినారు. ఆ విదుషీమణికి మా కృతజ్ఞతలు. —సం.]

" మత్కర్మకృన్మత్పరమో
మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు
యస్సమామేతి పాండవ ॥

ఈ శ్లోకం విశ్వరూప సందర్శన యోగమునొక్క చివరి శ్లోకం. ఇది రాబోవు భక్తియోగమునకు పునాదివంటిది. భగవానుడీపునాదినుండియే భక్తియోగమను భవనమునుతీర్చి దిద్ది నిర్మించెను. ఇందు అయిదు అంశములు గలవు. 1. నాకొరకై కర్మ చేయువాడును, 2. నన్నే తన బుద్ధి యందు నిల్పినవాడును, 3. నా భక్తుడును, 4. ఫల సంగమును కోరనివాడును, 5. సర్వ భూతములయందును వైరము లేనివాడును, ఈ అయిదు అంశములును గలవాడు నా సమానుడని భగవానుని వాక్యము రాగా శంకించి, అర్జునుడీవిధముగా ప్రశ్నించెను.

"స్వామీ! అట్టివాని భక్తి సగుణమా? నిర్గుణమా? ఇందులో ఏ భక్తి శ్రేష్ఠమైనదో తెలుపుమ్?" మన భగవానుడు...(1) మయ్యావేశ్యమనోయేమాం"...(2) "యేతుసర్వాణి కర్మాణి మయి సన్న్యస్య"...(3) మత్కర్మపరమోభవ..." (4) "మయ్యర్పిత మనో బుద్ధిః..." (5) "అద్వేష్టాసర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ..." అను యీ విధు అంశములచేతనే భక్తియోగమను అధ్యాయమును పూర్తి నొందించిరి. - ఇందు ఒక్క అంశమును సమగ్రంగా అర్థం చేసుకున్నచో మిగిలినవాటినికూడా బాగుగా తెలియ నగును. ముఖ్యముగా సర్వమానవులకున్నూ తెలియదగిన అంశము 'మత్కర్మ పరమో భవ' - అనువిషయము. ఏలయున, కర్మను విడచియుండుట యసాధ్యము. గనుక కర్మ యందు బంధమంటుని కర్మచే భగవానుని మెప్పించనగును. కావున, అట్టి కర్మను గూర్చి తెలిసికొని యాచరించుటయే ముఖ్య కర్తవ్యము.

భగవంతుని స్వరూపమును దెలియక భగవత్కర్మను దెలిసికొనజాలము. కాబట్టి తొలుత భగవద్రూపమును గురించి విమర్శింతము. భగవంతుని సద్రూపమనియు, చిద్రూపమనియు, ఆనందరూపమనియు, అఖండ — అసంగరూపమనియును, సర్వ వ్యాపిగను, సర్వాంతర్యామి యనియును పెక్కురీతుల శ్రుతులు ఘోషించుచున్నవి.

వేదగోచరము ఆ పరమాత్మవలననే యీ చరాచరాత్మక ప్రపంచమేర్పడినది. ఇందలి సృష్టి-స్థితి-లయములు ఆ జగదీశ్వరుని విలాసములు. కాదేని, యీ చరాచరాత్మక మయమైన విశ్వమును నిర్మించు శక్తి యెవరికి గలదు? సర్వమును జగదీశ్వరుని మయమే-, గావున 'ఈశావాస్యమిదం సర్వం'- అన్నది శ్రుతి. అట్లు ఉన్నది ఉన్నట్లుగ తెలిసికొనుటచే జనన మరణాది గర్భనరక నివాసమునుండి విడుదల బొందనగును. అట్టివానినే 'మత్పరము'డని చెప్పబడియెను. (1)

నాయందే మనస్సు నుంచినవాడగుటచే పరుసవేదికిసోకిన లోహము బంగారమగునట్లు భగవంతుని స్వరూప విమర్శనచేత తాను భగవద్రూపుడేయగును. కారణమేమన ఉప్పుజాతియొక్క మూలస్థానము సముద్రమేయైనట్లు, తన పుట్టుకకు మూలస్థానము భగవంతుడేగనుక, దైవతత్త్వమును గూర్చి తెలిసిగాని, తెలియక గాని, ప్రేమచే గాని, వైరముచేగాని, భావము చేరియుండుటచే తద్రూప మొందుట కెట్టిసందియమును లేదు. దృష్టాంతమునకు ఘంటాకర్ణుడను వాడు నారాయణ శబ్దమును వినరాదని చెవులకు ఘంటలను కట్టుకొనియుండియును హృదయమందు నారాయణ స్మరణ తనకు తెలియకనే జరుగుచుండెనుకదా! అట్లు ఏ విధముచేనైనను నాయందు మనోబుద్ధుల నర్పించినవాడు మద్భక్తుడు అనబడును. (2)

మఱొకవిధమున యోచింతము. మానవుడు 'సర్వకార్యములను తానే జేసితి'నని తలచునుగదా!- తనయందు తోచెడి సమస్త యూహాలున్నూ, ఎవని అధీనములై యున్నవి? నిద్రావస్థయందు సర్వవ్యాపారములును ఉడుంగగా- ఎవనికరుణవలన అవియన్నియును తిరిగిలభించుచున్నవి? సర్వాంతర్యామియొక్క- దయగాక-, ఇందు కర్త ఎవరు? సర్వకారణకర్త పరమాత్మయే, అయియుండగా చేయువాడును, చేయించువాడును, ఆనందించువాడును, ఆ పరమాత్మయే. "కర్తా భోక్తా జనార్దన"- అని తేలినది. ఆ పరమాత్మ నూతనప్రియుడు. ఆనందమే యాతనిరూపము. గాన దేనియందైనను ఆనందానుభవములేక ఎవరునుగాని ఏ పనినైనను చేయజాలరు. సర్వకార్య రూపమునను భాసించెడి ఆనందానుభవము ఆపరమాత్మయొక్క- ప్రతిబింబమేయగును. అట్లగుటచే శతవృద్ధులైనను బాలురైనను వారివారికి తగిన కొలది కార్యములను విసుగుజెందక ఉత్సాహపరవశులై కార్యరంగమును సాగించుచునేయుందురు. ప్రతి దినమును చేసినదే మరల జేయుచున్నను, నూతనోత్సాహమును పొందుచుండుటకేమి హేతువు?... భగవంతుని ఆనందాంశమచట నిలచియుండుటనుబట్టి పశు-పక్షి-క్రిమి-కీటకాది సర్వభూతములు వానివాని కార్యారంభములను సాగించుచున్నవిగా? సూత్రప్రాయమై సర్వభూతములలోను, తాను నివసించి తన సచ్చిదానందాది స్వరూప కిరణములను సర్వత్ర సర్వదా ప్రసరింపజేయుటచే సర్వకర్తతానే అయ్యెనని దెలసి చేయు కర్మయందు కర్మబంధమంటుటలేదు. సర్వమందును ఆ పరమాత్మనే దర్శించువాడు. గాన అతనినే 'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ'-, అను విషయము అతనియందు సార్థకమగును. (3)

సర్వమందును పరమాత్మను దర్శించువాడగుటచేత తనయందుకూడ పరమాత్మవినా అన్యము లేదని తలచును. గాన, ఫలాభి సంగమందు అతనికి కోరదగిన దేదియును లేకపోవుటచేత సంగవర్జితుడగును. (4) సర్వకాల సర్వావస్థలయందును సర్వత్రఏకరసమై వ్యాపించినట్టి ప్రియవస్తువును దర్శించువాడు అనగా పాకభేదముచే నానావిధరూపములు గల పదార్థములు తయారు చేయబడినను వాటియందలి మాధుర్యమునుబట్టి ప్రతిపదార్థమునందును అట్టి మాధుర్యము నిచ్చునట్టి వస్తువును చక్కెరయేయని గుర్తించునట్లు, చరాచరాత్మకమగు ప్రపంచమనందు తోచెడి వివిధనామరూపములందును సూత్రప్రాయమై వ్యాపించియున్నట్టి పరమాత్మ ఏకరసమై యున్నదని తెలిసి భగవదర్పితముగా చేయబడెడి కర్మయే 'మత్కర్మ' అనబడినది (5). ఇట్టి బ్రహ్మార్పణమొనరించు కర్మచేతనే బ్రహ్మకర్మ సమాధినొందనగును. అట్టివానిజన్మమే జన్మము. అట్టివానిని భగవానుడు తన శ్రీముఖమున నాకు ప్రియుడనియు, భక్తుడనియు, యుస్సమామేతి యనిచెప్పెను. గాన, ఆత్మీయులారా! మనలనందరను భగవానుడట్టి శ్రేయోమార్గమున నడిపించుగాక! శాంతి సౌఖ్యములను మనకు చేకూర్చుగాక! గీతాచార్యుని కృపకు మనమందరము పాత్రులమయ్యెదము గాక!!!

ఓమ్ తత్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

— శంకరమంచి చెంచులక్ష్మమ్మ,
వేంపలె.

గీత ఏదో పాండిత్య వైభవ ప్రదర్శనంకాదు. వాగాడంబర విన్యాసంకాదు. క్షణికావేశ ప్రపూరం కాదు. సంకుచిత సంప్రదాయ సీమాబద్ధంకాదు. ఇదొక తంతుకాదు; తతంగంకాదు. ఒకానొక ఋషి పల్కిన శాస్త్రముకాదు. సార్వజనీన సార్వభౌమ సార్వకాలీన సత్యశివసుందర స్వయంభూ భగవద్వాణి.

శ్రీ భగవద్గీత

# మాధ్వభాష్యానువాదము

విద్వాన్ — శ్రీ ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు, బళ్ళారి.

(1954 సెప్టెంబరు సంచిక 11వ పేజీ తరువాయి)



గీతయనగా భగవద్గీతయే. ఇతరగీతలు స్వోపపదములుకాన అముఖ్యములు. ఇట్టిగీత కౌరవ పాండవ యుద్ధారంభమున జరిగినది. గీతోపదేశముపొంది భగవత్ప్రీత్యర్థమై, భగవ దుపదేశానుసారముగా, స్వవర్ణాశ్రమోచిత విహితకర్మానుష్ఠాన మొనర్చుచు భగవద్ద్వేషి తదనుబంధి నిగ్రహమే క్షత్రియునికి పరమ ధర్మమగుటను తెలిసి తన ధర్మమును నిర్వ ర్తించి అర్జునుడు కృతార్థుడైనాడు. ఈగీతను సంజయుడు వేదవ్యాసానుగ్రహమున విని, తెలిసి ధృతరాష్ట్రునికి తెల్పినాడు. "నీ పుత్రులు — పాండవులును యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమున నిలిచియున్నార"ని సంజయుడు చెప్పెను. వెలుపలి గ్రుడ్డిమాత్రమేగాక లోగ్రుడ్డియై ధృతరాష్ట్రుడు ధర్మార్థ కామ మోక్షములు చెడినను రాష్ట్రమును ధరింపవలెనను దురాశచే పాండవులు వనము లోనే, కౌరవులు రాజ్యమునందేయుండి యుద్ధమే లేకున్న బాగుండునని సంజయునిచే రాయబారమంపిన పుత్రప్రీతి పరాయణుడు, స్వార్థనిరతుడు సంజయుని ప్రశ్నించు చున్నాడు.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1

తా॥ సంజయా! పుణ్యకరమగు కురుక్షేత్రమున కలిసి నావారైన కౌరవులును, పాండవులును యుద్ధమాడ కోరినవారై ఏమిచేసిరి?

వి॥ సంజయ! — జయమునే నీవు చెప్పగలవు. అదియు నాపుత్రులకేయని "మామకాః సంజయ" యని సూచించెను. మరియు అరిషడ్వర్గమును జయించిన సంజయా! రాగద్వేషములులేక నిష్పక్షపాతముగానైన చెప్పుము. సం — సజ్జనులగు పాండవులకే; జయ — జయము కల్గుననియు నీవు చెప్పవచ్చును. ధర్మక్షేత్రమున సజ్జనులగు పాండవు

లకే జయము కలుగుట నిశ్చయము. ఏలననగా వారు ధర్మపరులు. ధర్మరాజే వారి నేత. అట్టి నేలపై నావారు యుయుత్సవః = యుద్ధము చేయగోరినారే? వారెట్లు జయింప గలరో చెప్పలేనని యాక్షేపము. కురుక్షేత్రము ధర్మమను బీజమును అనంతముగా చేయు క్షేత్రము = భూమి. కాని అధర్మమును పెంచునది కాదు. అంతేకాదు నాపుత్రులు పుణ్యాకరమగు కురుక్షేత్రమునకుపోయి స్నాన దానాదు లాచరించుటమాని యుద్ధమాడగోరిరికదా యని యాక్షేపము. మామకాః యనుటచే పాండవులు నావారు కారను ద్వేషభావము వ్యక్తమగుచున్నది. ఏమిచేసిరి అనుప్రశ్న "రాజ్యమును నాకొడుకులకేవదలి మరల పాండవులు భిక్షమే శ్రేయమని" పోయిరా? అని ఆకాంక్ష తెలుపుచున్నది.

శ్రీగీత "ధర్మ" శబ్దముచే ప్రారంభమగుటచే – 'ధర్మ' శబ్దము సకల లోకధారకుడగు భగవంతుని పేరగుటచే – వస్తుసంకీర్తనరూపమగు మంగళాచరణము కలిగియుండి పరమ మాంగలిక గ్రంథరాజమై యున్నది.

'ధర్మ' అని ప్రారంభము. "సంజయ" అని కొన. దీనివలన ధర్మమొనర్చితివా జయము కలుగునని సూచన. అట్లే ధర్మాత్ములగు ధర్మరూపీ కృష్ణ సహాయులగు పాండవులకే కొనకు సంజయము కలిగినదను ఫలాంశముగూడ చక్కగా చెప్పబడినది.

"మమ" జయించదు. "పాండవాః" (పండా = జ్ఞానము) జ్ఞానమే జయించుననియు నుల్లేఖింపబడినది.

సంజయుడామాట విని, ధృతరాష్ట్రుని మనస్సు పుత్రక్షేమాతురంబై యుండుట నెఱింగి, నవ్వి, దుర్యోధనుని చేష్టల వర్ణించుచున్నాడు. భీతిని, ఆశ్చర్యమును, నిరాశను సూచించు అతని వాక్యములను వినిపించుచున్నాడు.

సంజయ ఉవాచ:—

**శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా ।**
**ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2**

తా॥ సంజయుడు చెప్పుచున్నాడు:– అప్పుడు రాజగు దుర్యోధనుడు వ్యూహాములుగా నిల్చిన పాండవుల సైన్యమును చూచి, తన గురువగు ద్రోణాచార్యుని సమీపించి యిట్లు పలికెను.

వి॥ పాండవ సైన్యము చూడకముందు మహాధైర్యముతో నేనే గెల్తునని క్రొవ్విన దుర్యోధనుడు తన 11 అక్షౌహిణులకంటె చిన్నదై 7 అక్షౌహిణులు కలదయ్యు ధైర్యముతో యుద్ధసిద్ధమై నిల్చిన పాండవబలమునుచూచి భయపడెను. ఉత్సాహము తఱిగెను. సేనాపతియగు భీష్ముని విడిచి ద్రోణాచార్యునికడకు తానే పరుగెత్తెను. దుర్యోధనః అని చెప్పి ధృతరాష్ట్రునికి కోపము కల్గించితి నేమోయని "రాజా" అని జోడించెను. దుర్యోధనునికి తానే రాజరాజను దురభిమాన మెక్కువయని సూచించెను. దుర్యోధనపదము, దురభిలాషతో యుద్ధము చేయువాడని తెల్పుచున్నది. భీష్మాదులను మన్నింపని మూర్ఖ

డని భీష్మునివిడిచి — "ఆచార్య ముపసంగమ్య" అను మాట సూచించుచు, ఆచార్యునికిగూడ నమస్కరింపక "మాటలాడించె" ననుటచే — ద్రోణుడు — తానిచ్చు జీతముగొను సేవకుడను తాత్సారభావముతో వ్యక్తమగుచున్నది. పాండవ పక్షపాతియగు ఆచార్యుని హెచ్చరించుటయే అతని యుద్దేశ్యము.

దుర్యోధనుడు పల్కిన మాటలను సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య మహతీం చమూం।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3

తా॥ ఓ ద్రోణాచార్య! మీ శిష్యుడగుటవలన నిపుణుడును, ద్రుపదుని కుమారుడు నగు ధృష్టద్యుమ్నునిచే రచింపబడిన యీ పాండవుల గొప్ప సేనను చూచితిరా.

వి॥ మీ శిష్యుడు మీ కెదురుతిరిగెను చూడుడు. ద్రుపదుడతనిని పుత్రునిగా పడసినది మిమ్ము చంపుటకేయని తెలిసియు అతనికి అస్త్రవిద్యోపదేశము చేసిన ఫలమిది. ఆచార్య! నీపై పాండవులవలె మేము కత్తిదూయము. గురుభక్తులము. కాని మీకు పక్షపాత మేమో పాండవులయందే. పాండవులు పాండుపుత్రులా? కారు. వారు కుండగోళకులగుటచే రాజ్యాధికారము వారికెక్కడిది? కాని వారింత గొప్పసేనను కూర్చుకొని వచ్చినదిచూచి మీకానందము కలుగుచున్నది కాబోలు!

"కానిమ్ము! ధృష్టద్యుమ్నుని మీరేవరైన చంపివైచిన సరిపోవునని" చెప్పరాదు. పెక్కురు వీరులక్కడ గలరు.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4
ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ 5
యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ 6

తా॥ ఆ పాండవ సేనలో శూరులగు యుయుధానుడు, సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యువు, అభిమన్యుడు, ద్రౌపదీపుత్రులునను మహారథికులు గలరు.

వి॥ 'ద్రౌపదేయాశ్చ' అనుటచే ఘటోత్కచుడు, పాండ్యరాజునుకూడ కలరని యర్థము. శస్త్రాస్త్ర ప్రవీణుడై తన్ను సారథిని అశ్వములనూ సంరక్షించుకొనుచు పదకొండువేల భటుల నెదిరింపకలవాడు మహారథికుడు. వీరందరు మహారథికులే. వీరితో నెట్లు పోరుటయో యని భయమగుచున్నది. (సశేషము)

# ★ స్వస్వరూపజ్ఞానము. ★

వేదాంతపితామహులగు శ్రీరాజేశ్వరానందస్వాములవారు, M.A., D.Litt.,

సంపాదకులు – The Call Divine.



( 1954 అక్టోబరు నెల సంచిక 29_వ పుట తరువాయి )

ఈ మూఁడు కర్మలును యజ్ఞాదులును యజ్ఞానాధీనములు. అవిద్య కామకర్మములు సంసార బీజములు. స్వరూపజ్ఞానముచేత నజ్ఞానము లేకపోవునప్పుడును, దానికిఁ గార్యములైన కర్మములును శూన్యములగుచున్నవి. వీటికి సాక్షిగాను, విలక్షణముగాను, ప్రకాశముగాను యుండు యాత్మకు (తెలివికి) సంబంధము లేదు. ఒకడు కొండను వృక్షమునుఁ జూచునపుడా కొండతోను, వృక్షముతోను సంబంధములేనట్లు వికారములు బొందకుండునట్లు, యాత్మ–తెలివి (జ్ఞానము–ప్రజ్ఞ) యవస్థాత్రయములను, శరీరత్రయములను, సమస్త త్రిపుటులను, పంచకోశములనుఁ జూచునపుడు వాని వికారములు బొందక సర్వదా తానుగ నేయున్నది. అజ్ఞానవశమున 'నేను, నాది' యనుచు దేహమును ప్రారబ్ధవశమున ననుభవించుచు నాగామివశమున దేహముగావలయునని గోరుచు సంచితవశమున గోరికలను మిగిలించుకొనుచు సంసారసాగరమునఁ జక్రాకారమున నాత్మ పరిభ్రమింపదు.

బుద్ధిశక్తియుండుటచేత మనుష్యజన్మము త్తమమైనది. ఏనుఁగునకు మానవునికన్న దేహబల మధికముగనున్నది. అట్లుండినను మానవుని బుద్ధిశక్తికి లోఁబడియున్నది. ఏనుగునకట్టి బుద్ధిశక్తిలేనందుననే మానవబుద్ధిశక్తికి స్వాధీనమైయున్నది. తనకన్న వేయిమడుంగులు దేహబలమధికముగనున్న యేనుఁగును మానవుడు యేశక్తితో స్వాధీనమొనర్చుకొనెనో యాశక్తినే బుద్ధిశక్తియందురు. ఈ బుద్ధిశక్తివలననే మానవుఁడు విజ్ఞానశాస్త్రమందును, మంత్ర తంత్ర యంత్ర జంత్ర శాస్త్రములయందును, వ్యవసాయ వ్యాపార యుద్యోగములందును, రచనలయందును నిపుణతను బొందియున్నాఁడు. శబ్దమును అక్షర, భాషాది రూపములుగ వ్యవహరించుటకును, మనుష్యసముదాయమున నన్యోన్యభావముల గ్రహించుటకును, బుద్ధిశక్తియే కారణమై యున్నది. ఒకరాజుగారి కుమారునకు రాజ్యమునందు హక్కుగలుగునట్లు బుద్ధిశక్తి పరంపరాబాధ్యత కలిగినదిగాదు. కావున జన్మలలో మానవజన్మ శ్రేష్ఠతమమని యనుటకు అనుభవమే నిదర్శనము. ఇట్టి గొప్ప బుద్ధిశక్తిని గొప్పదైన యాత్మానుభవమునకే నుపయోగించుటధర్మము. లౌకికానుభవములగల దేహముకన్న, లోకమునకన్న వేరై, శాశ్వతమై నిరతిశయానందమై యుండునది యాత్మస్వరూప మొక్కటియే.

'స్వశక్తి' యనునది స్వస్వరూపస్వభావము, ప్రజ్ఞావంతము, స్వయంప్రకాశము. ప్రకాశమానుఁడుగానుండు సూర్యుఁడు దనప్రకాశమును తనదిగాఁదెలియుట స్వశక్తి.

స్వస్వరూప స్వభావమగు ప్రజ్ఞయే కల్పిత నామరూపములయందు ప్రకాశించు తెలివి. తెలివినాశ్రయించు వ్యవహారములు, తద్వ్యాపకలుగు సర్వానుభవములు ప్రజ్ఞాస్వరూపుండగు తనశక్తియగు జ్ఞానము నాశ్రయించియే యున్నవి. కావున నాత్మయగు తన్నాశ్రయించి లోకదేహములు యౌపచారికముగ నుండుటయే గాని, లోకదేహముల నాశ్రయించి తానెన్నడు నుండుటలేదనెడి నిశ్చయమే స్వశక్తి సాధనము.

జగత్తు సత్యమనెడి నిశ్చయానుభవమె సంపూర్ణభ్రాంతి. జగత్సత్యత్వ విశ్వాసము గల దేహాభిమానబుద్ధియే భ్రాంతుడు. భ్రాంతుఁడనగా భ్రమగలవాడు. తానుగాని దేహేంద్రియాదులయందు దానెనెడి నిశ్చయమే భ్రమ. తన్ను తాను తెలియకపోవుటయే భ్రమకుఁగారణము. ఇదియేయజ్ఞానము. భ్రాంతునియొక్క యనుభవములన్నియు భ్రాంతి కల్పితములు. కనుక, జగత్తు మిథ్య, తానిట్టివాఁడనని నిశ్చయించు విపరీతనిశ్చయమున కజ్ఞానమేస్వభావము గాని, యధిష్ఠానమగు స్వయంప్రకాశజ్ఞానమున కజ్ఞానము స్వభావము కాదు. అట్టిజ్ఞానము స్వతస్సిద్ధముగా నుండినను తెలియకపోవుటయే యజ్ఞానము.

'తెలియమి' యనునజ్ఞానము భ్రాంతుల స్వానుభవసిద్ధమే గాని, యాత్మస్వరూపము నందొకప్పుడును లేనిది. ప్రకాశమానుడగు సూర్యునియందు చీకటి యసంభవము. "సూర్యుఁడు నాకుఁ గనుపించుటలేదు. చీకటిగా నున్నది"యనుటలో జూచువాని దృష్టి దోషమే గాని సూర్యుని స్వభావముకాదు. 'ఇపుడు నాకు చీకటియే' యనుభవమునందున్నదని వ్యవహరించుటకుఁ గారణము చీకటికి విలక్షణమగు వెలుతురనునదొక్కటి యున్నదన్న నిశ్చయమువలననే గదా! అట్లే స్వయంజ్యోతి స్వరూపమగు పరమాత్మ 'అజ్ఞాన, అజ్ఞాని, అజ్ఞానానుభవము' యీ త్రిపుటికి వివర్తకారణమై ప్రకాశించుచున్నది. అనగా నదిగాక ఇంకొకటిలేదు. ఇంకొకటికలదనుట స్వాప్నకల్పితము. తానిట్టివాఁడననెడిజ్ఞానము నిద్రావస్థయందులేదు. నిద్రావస్థయందు దానిట్టివాడనన్న జ్ఞానములేమి నిద్రాపురుషుని యందు "స్వప్నపురుషుడు, స్వప్నదర్శనము, స్వప్నదృశ్యము"లనెడి త్రిపుటిని తనయందు దాననెడి జ్ఞానములేని తానే తనచేతనే కల్పించుచున్నట్లు పరమార్థస్థితియందు నిద్రాపురుషున కన్యములేకపోవుటచేత దానే కారణమైనట్లావిధమగు కారణమునకు వివర్త కారణమని పేరు. తనయందు దనచేతనే మిథ్యాభూతముగా నారోపింపబడిన దానిచేతదన కేమియు లేక దానికి నిమిత్తమాత్రముగా తానుండుటచేత వివర్తకారణమనియనంబడినది.

అన్యదృష్టియనగా నవిద్యయొక్క కార్యము. అది స్వప్నతుల్యమైన మిథ్య. మిథ్యాజ్ఞానజన్య రాగాదిజన్యజనిత కర్త, కర్మ, క్రియాసాధ్యమగు ఫలము నిత్యముకాదు. చిత్స్వభావములేని చిత్తాదులు చిత్స్వభావముగనుండుట ఉష్ణముకాని యుదకమున కుష్ణధర్మమువలెనున్నది. వేదాంత మహావాక్యములకుఁ జిత్తాదులచే గ్రహింప శక్యముకాని యాత్మైక్యజ్ఞానమునందే స్థిరతరమైన తాత్పర్యముంగలదు. అదియే పురుషార్థబోధకము. తదితర వాక్యము లవాంతరములు గాన, వాక్యాభాసములు. కర్తృత్వాదికము పురుషతంత్రమైనది; మాయామయమైనది. అకర్తృత్వము, అభోక్తృత్వము, అపౌరుషేయములు, యివి యాత్మస్వభావము. దేహాది సర్వేంద్రియములకు విలక్షణమై, సర్వోపాధి సంగరహితమై, వర్ణాశ్రమాదులులేనిదై, కర్మాసక్తిలేనిదై, స్వతంత్రముగానుండునది సత్యజ్ఞా

నంద స్వరూపమైనది యాత్మ. ఇట్టి యాత్మజ్ఞానముచే స్వతస్సిద్ధమైన నైష్కర్మ్య సిద్ధి యగు ముక్తి హస్తగతము.

అహంకారము జడమైనను నాత్మసాన్నిధ్యమువలన "నేను" "నాది" యని వ్యవహరించుట సహజము; ప్రత్యక్షగోచరము. 'అహం' శబ్దము సైతమాత్మయందు ప్రవర్తించుటలేదు. 'అహం' శబ్దమునకు లక్ష్యమైనదాత్మ. వాచ్యమైన దహంకారము. వాచ్యమైన నీయహంకారము ముఖ్యవృత్తిచేత జన్మ కర్మ దేహాదికములనే సూచన జేయునుగాని జాతి, కర్మ, దేహ, లింగ రహితముగా నాత్మను బోధింపదు. ఆత్మయందు వాచకశబ్దము లేదు. అహం శబ్దమునకు లక్ష్యార్థ మాత్మ యగుచున్నది. వాచ్యవాచకములకు సంబంధముగలదు. అదియు నౌపచారికము మాత్రమే. ఉపనిషత్తులయందు లక్షణావృత్తిచేత నాత్మ బోధింపబడునుగాని, యిదమిత్థమని ప్రత్యక్షముగా కాదు. అహంకార మాత్మశబ్దమునకు వాచ్యార్థము. అహంకారమాత్మాభాసము, అహంకారము దేహాభిమానబుద్ధి. దీనిచేఁజేయు మంచికర్మగాని, చెడుకర్మగాని, అకర్మగాని, వికర్మగాని, ఉదాసీనతగాని, విలక్షణతగాని యజ్ఞానాధీనమె. నామరూపభేద దృష్టి వేదవిహితముకాదు. స్వయుక్తికముచేత ననగా స్వేచ్ఛావిహారముచేత ప్రత్యక్షానుమానోపమాన ప్రమాణముల నతిక్రమించి చేయు కృత్యమహంకారముతోఁగూడినది. బుద్ధి ధర్మయుతము. అది యధర్మంబగును. ఆత్మలేక బుద్ధిప్రకాశింపదు. బుద్ధిలేక నాత్మయు ప్రతిఫలనముకాదు. బుద్ధికి బోధలేదు. ఆత్మకు క్రియలేదు. వాస్తవముగా నహంకారము బుద్ధి, దేహము, జగత్తు మొదలైనవి కానిదియు లేనిదియునాత్మ. వాటిని ప్రకాశింపజేయు ధర్మప్రకాశక క్రియ ప్రత్యగాత్మకులేదు. పత్యగాత్మకు పారమార్థిక జీవత్వమును సాక్షిత్వమును కల్పితములుగాన, యాథార్థ్యమున సచ్చిదానందాద్వితీయ బ్రహ్మలక్షణము కలదైయున్నది. అహంపదమునకు ప్రత్యయము (లక్ష్యము) ప్రత్యగాత్మ. పరోక్షజ్ఞానమునకు స్థానమైన బుద్ధి యవాంతరవాక్యములతోఁగూడినది. జడబుద్ధి నతిక్రమించినగాని యపరోక్షజ్ఞానము కుదరదు. శాస్త్రజన్యజ్ఞానము పరోక్షమువఱకు మాత్రమే. ధాన్యమును గ్రహించి గడ్డిని త్యజించురీతిగ నపరోక్షజ్ఞానము లభ్యపడినవెంటనే పరోక్షత్వము జారిపోవును. ప్రత్యక్షానుమాన ప్రమాణములమీద నాధారపడియుండు బుద్ధి పరోక్షముగా 'నేను దేహమును గాద'ని తెలుపుటకుమాత్రమే శక్యమైనది. శ్రుతిశిరస్సగు వేదాంతవాక్యము మాత్రమే "బ్రహ్మమేయగు"నని స్వతంత్రముగా బోధించు శక్తిగలది. అపరోక్ష మాత్మస్వభావము. ప్రత్యగాత్మచే ప్రకాశింపఁబడు బుద్ధి ప్రత్యగాత్మను సాక్షాత్కరింపజేయుటకు ప్రయత్నించుట నిప్పును కట్టెకాల్చుటకు ప్రయత్నించినట్లుగ నిష్ప్రయోజనంబగును. ఇక ప్రయోజనమైన దెద్దియన, నద్వితీయబ్రహ్మస్వరూపజ్ఞానము. "సత్ బుద్ధి"యగు పరోక్షజ్ఞానముచేత శాస్త్ర, దేహ, లోకవాసనలను వీడి, ప్రత్యగాత్మవైపునకే నిలకడజెందియుండినయెడల నప్పుడా బుద్ధి జ్ఞానాగ్నిచేత దీపితమై దృశ్యభేదజాతమును బాధించి దగ్ధపటన్యాయమున (కాలిన కాగితమునందక్షరములు కనుపించువిధము) స్ఫురించుచుండును. అప్పుడు "అయమాత్మా బ్రహ్మ"యను దర్శనవాక్యము లక్ష్యభూతమగుచున్నది. ఇట్టి యనుభవస్థితి గురుశిష్యన్యాయమున సాక్షాత్తుగా గలుగు "తత్త్వమసి" యను శ్రుతిసిద్ధమైన మహావాక్యార్థ జన్యజ్ఞాన బోధచేత బ్రహ్మాత్మా పరోక్షజ్ఞాన సాక్షాత్కారము కలుగుచున్నది. (సశేషము)

# 6–12–54 నాటి గీతాజయంతి వార్తలు.

[ స్థల సంకోచముతో వార్తలను సంక్షేపించవలసి వచ్చినది. — సం॥ ]

**ఆళ్ళగడ్డ** — శ్రీ గీతావాణీ కార్యాలయమునందు మార్గశిర శు. ౧౧ సోమవారం 6–12–54 శ్రీ గీతాజయంతి మహోత్సవము ఎప్పటివలె మహదానందముగ జరిగినది. శ్రీ రామానందస్వామి – సాధు చెంచయ్యగారి శ్రద్ధాభక్తులతో అనేకులు స్త్రీ పురుషులు యీ కార్యమున పాల్గొనిరి. పూజలు – పారాయణములు – భజనలు ఆ రోజంతయు ప్రశాంతముగ నెరవేరినది.

**చాగలమర్రి/చాకరాజవేముల** (కర్నూలు జిల్లా) – శ్రీ పార్థసారథి సేవాసంఘమువారు మహద్వైభవముగ గీతాజయంతిని జరిపినారు. శ్రీ రామకృష్ణానంద – సాధుమాత చిన్నమ్మగారు ఆ కార్యక్రమమున పాల్గొనినారు.

**ద్రోణీపాడు/దొన్నిపాడు** (కోయిలకుంట్ల తా॥) — గ్రామభక్త సంఘమువారు గీతాజయంతీ మహోత్సవము జరిపి విరివిగ దరిద్రనారాయణ సంతర్పణ మొనర్చినారు.

**బంగారుపేట** (మైసూరు స్టేటు) — గ్రామభక్త సంఘమువారు మాధవ ధర్మశాలలో శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధిన గీతాజయంతి కార్యక్రమము 6–వ తేది మొదలుకొని మూడురోజులు మహద్వైభవముగ జరిపినారు. పూజలు – పారాయణము – పోటీపరీక్షలు – బహుమతి వితరణలు – ప్రసాదవినియోగములు సక్రమముగ జరిగినవి. శ్రీ ఎం.వి. రామలింగయ్యగారి పుత్రిక, మహిళాసంఘాధ్యక్షురాలు శ్రీమతి కె.యం. రాజలక్ష్మమ్మగారు గీతాజయంతి వైభవమునుగూర్చి తాము వ్రాసిన గేయమును గానముచేసినారు.

**గోసపాడు** (కర్నూలు జిల్లా) — శ్రీ రామభజనసంఘమువారు అత్యంతశ్రద్ధాభక్తులతో గీతాజయంతి కార్యక్రమమును నెరవేర్చినారు. శ్రీ బాలకృష్ణశాస్త్రిగారి అధ్యక్షతతో గీతోపన్యాసములు జరిగినవి. శ్రీ పరాయితం వెంకటరామయ్యగారు – మిరియాల యల్లయ్యగారు – నల్లగట్ల అయ్యప్పరాజుగారు మొదలగు ప్రముఖులు ఉపన్యసించినారు. ఈ పవిత్రకార్యమునకు అయిన ఖర్చును శ్రీ మిరియాల వెంగయ్యశ్రేష్ఠిగారు ఉదారబుద్ధితో భరించినారు. స్త్రీ పురుషులు – బాలబాలికలతో కార్యక్రమము సుసంపన్నమై రాణించినది.

**రామిరెడ్డిపల్లె** (కడప జిల్లా) — శ్రీ యోగానందాశ్రమమునందు శ్రీసాధు గగనానందస్వామివారి అధ్యక్షతతో గీతాజయంతి కార్యక్రమము ఆనందముగ జరిగినది. ప్రముఖులు పలువురు పాల్గొని పూజలు – పారాయణాలు – భజనలు – ఉత్సవము – కాలక్షేపములు శ్రద్ధతో నిర్వహించినారు.

**కల్యాణదుర్గము** — శ్రీ గీతాభక్తమండలివారు గీతాజయంతి మహోత్సవమును యథావిధిగ నొనర్చినారు. శిరస్తారు శ్రీ నరసింహ శాస్త్రులుగారి అధ్యక్షతతో ఉపన్యాస కార్యక్రమము జరిగినది. శ్రీ మహాదేవస్వామివారు – టి. ఎర్రప్పగారు – టీచరు హనుమంతప్పగారు – మేస్త్రి అనుమప్పగారు ఉపన్యసించినారు. విజయవాడ శ్రీ ఆనందభారతి స్వామివారు గీతావిషయమై ప్రవచనము చేసినారు. సౌతున్యాలు బాలబాలికలు పద్యములు, పాటలు పాడి

నారు. కార్యక్రమమునకైన ఖర్చు శ్రీ ఆర్య వైశ్యసంఘమువారు ఉదారముగ భరించి గీతామాతయొక్క అనుగ్రహమునకు పాత్రులైనారు.

చాగలమర్రి — శ్రీ శివరామానందాశ్రమభక్తులు గీతాజయంతి కార్యక్రమమును మహదానందదాయకముగ జరిపినారు.

కళింగపట్నం (శ్రీకాకుళం) — శ్రీ గీతామండలివారు 6, 7 తేదీలు రెండు దినములు శ్రీ గీతాజయంతి మహోత్సవమును కడుశ్రద్ధాభక్తులతో జరిపినారు. శ్రీ నరసింహాచార్యులవారి ఉపన్యాస కాలక్షేపము జరిగినది.

చేళూరు (కోలారుజిల్లా) —శ్రీ కోదండరామ భజనసంఘమువారు శ్రీ గీతాజయంతి కార్యక్రమమును శ్రీ వై. శ్యామశర్మగారి అధ్యక్షతతో మహద్వైభవముగ జరిపినారు.

వెంకటగిరిటౌన్ — శ్రీ దివ్యజీవన సంఘమువారు యథావిధిగ శ్రీ గీతాజయంతి కార్యక్రమమును జరిపినారు. శ్రీ ఎ. ఎస్. జానకీరామయ్యగారి అధ్యక్షతతో విద్వాన్ జి. నరసింహశర్మగారును, దివ్యజీవన సంఘాధ్యక్షులు శ్రీ పి. సుబ్బరామయ్యగారును గీతాతత్త్వమును గురించి ఉపన్యసించిరి.

అజ్జంపూరు (మైసూరు స్టేటు) — శ్రీ శివానందాశ్రమమునందు శ్రీగీతాజయంతి సప్తాహము శ్రీ శంకరానంద స్వామివారి అధ్యక్షతతో మహద్వైభవముగ జరిగినది. గుబ్బి శ్రీ చిదంబరాశ్రమాధిపతులు శ్రీ చిదంబరస్వామివారి ఉపన్యాస కార్యక్రమమును శ్రీ గీతానందగారి గీతాభినయమును జరిగినది.

ముదిగొళం (చిత్తూరు జిల్లా) — గీతాభక్తసంఘమువారు గీతాజయంతి తృతీయ వార్షికోత్సవమును ప్రాథమికోన్నత పాఠశాలలలో భక్తిగౌరవములతో జరిపినారు.

పాయసం రంగారెడ్డిపల్లె (కర్నూలు జిల్లా) — వల్లకొండ నారాయణస్వామివారి అధ్యక్షతతో భక్తసంఘమువారు గీతాజయంతి కార్యక్రమమును సాంగమంగళముగ నొనర్చినారు.

చిత్తూరు — సంస్కృత భాషాప్రచారిణీసభచే శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి ఆధ్యక్ష్యమున గీతాజయంతి జరుపబడినది. శ్రీ కె. దక్షిణామూర్తిగారు, శ్రీ విద్వాన్ కాండూరు రామానుజాచార్యులుగారు, శ్రీ ప్రబోధానంద సరస్వతీస్వాములవారును గీతనుగురించి ప్రబోధించిరి. విద్యార్థులకు గీతాపోటీలు జరిగి గీతాగ్రంథములచే బహూకరింపబడిరి.

జనగామ (నైజాం స్టేటు) - భగవద్గీతామండలివారు యథావిధిగ గీతాజయంతిని నెరవేర్చినారు. హైదరాబాదు నివాసులగు సదాసనస్వాములవారు తమ మృదుమధుర వాక్కులతో గీతాతత్త్వమును గూర్చి ఉపన్యసించినారు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు — 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, — 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, — 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. — 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, — 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, — 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. — 8. శ్రీఉప్పులపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము, — 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. — 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, — 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.— 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, — 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. — 15. శ్రీపోలేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిదగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. — 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 18. శ్రీ పి. నరసింహశాస్త్రిగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదక్కపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. — 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. — 22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 26. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. — 27. శ్రీ సమయమంతుల ప్రకాశంగారు — సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి — 28. స్వర్గీయ సమయమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 29. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. — 30. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

నైజాంస్టేట్: 31. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 32. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 33. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరుస్టేట్: 34. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్ — 35. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మ

గారు, హూస్పేట - 36. శ్రీ గంగావతి భీమప్ప శ్రేష్ఠిగారు, నారాయణదేవరకెర. - 37. శ్రీ ఎం. వి. రామలింగయ్య శ్రేష్ఠిగారు, బంగారుపేట, - 38. శ్రీ జి. ఎన్. శంకర నారాయణ బ్రదర్స్, బెంగుళూరు సిటీ.

మద్రాస్ రాష్ట్రం: 39. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, - 40. శ్రీ గంధే వరసయ్య శ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లేవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోసపాడు. - 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. - 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. - 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. - 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. - 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. - 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె.-9. శ్రీ N. రామిరెడ్డిగారు,డబ్ల్యు. కొత్తపల్లె. - 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. - 11. శ్రీజూటూరు చెంచుసుబ్బయ్య శ్రేష్ఠి & గరుడయ్య శ్రేష్ఠిగారలు,చాగలమర్రి. -12. శ్రీమతి ఆర్.సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. - 13. శ్రీ పాణ్యం రామచంద్రయ్యగారు, నంద్యాల. - 14. శ్రీ పాణ్యం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. - 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యం. - 16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు. - 17. శ్రీ జి. సి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. - 18. శ్రీ యం. చిన్న ఈశ్వరరెడ్డిగారు, ఐలూరు.

కడప జిల్లా: 19. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. - 20. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనీవారు, ప్రొద్దటూరు. - 21. శ్రీ మిట్టా నారాయణ శ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. - 22. శ్రీ వెంటంశెట్టి శ్రీనివాస శ్రేష్ఠిగారు వేంపల్లి. - 23. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. - 24. శ్రీ ముమ్మడి పెద్దసుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 25. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. - 26. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. - 27. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. - 28. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. - 29. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, - 30. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 31. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 32. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. - 33. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. - 34. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. - 35. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. - 36. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి - 37. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 38. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. - 39. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి. - 40. శ్రీ మ్యాడం అశ్వత్థప్ప కల్యాణదుర్గం. - 41. శ్రీ కానుల శరభయ్య శ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. - 42. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్ప శ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. - 43. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడు, కల్యాణదుర్గం.

# గీతావాణి — పోషకవర్గము.

చిత్తూరు జిల్లా: 44. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 45. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 46. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, పెరియంబాడి. 47. శ్రీ నటకల రామనాధంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 48. బ్రహ్మచారి శ్రీ బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కసుపర్తిపాడు.

కృష్ణా జిల్లా: 49. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. — 50. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, పెనమలూరు. — 51. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. — 52. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 53. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 54. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 55. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 56. శ్రీ మాధంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 57. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి..

పశ్చిమగోదావరి జిల్లా: 58. శ్రీ ఆబోతుల రామన్నగారు, పాలకొల్లు. — 59. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 60. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. — 61. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. — 62. శ్రీ నాగబండి విశ్వనాధంగారు, వరంగల్. — 63. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి, వరంగల్. — 64. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, వరంగల్. — 65. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. — 66. శ్రీ తాటికొండ నాగయ్యగారు, వరంగల్. — 67. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. — 68. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్. — 69. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్. — 70. శ్రీయాదా నారాయణగారు, వరంగల్. — 71. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్. — 72. శ్రీ తోటి జగన్నాధంగారి ముక్తేశ్వర్‌గారు, వరంగల్. — 73. శ్రీగన్ను బుచ్చయ్యగారు, వరంగల్. — 74. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, వరంగల్. — 75. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ — 76. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 77. శ్రీ చండా పుల్లయ్యగారు, వరంగల్ — 78. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు వరంగల్ — 79. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 80. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 81. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 82. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 83. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 84. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. — 85. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. — 86. శ్రీమతి కుసుమ [illegible]మ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

## గీతావాణి – పోషకవర్గము.

మద్రాసు రాష్ట్రం: 87 శ్రీ శంకరనాయుడుగారు, కార్యాకారు, నార్తార్కాడు జిల్లా. – 88. శ్రీ పి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొల్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

### అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.
4. శ్రీమాన్ నేపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

---

# ప్ర శం స.

## శ్రీశంకరానందస్వామివారి గీతోపన్యాసములు అనంతపురంజిల్లా బెళగుప్పయందు జరిగిన సందర్భమున సమర్పించినది.

( కవి: పి. రంగయ్య – శిరిపికొట్టాల )

సీ॥ వ్యాస శుక ద్వయాపర మూర్తులనుబోలి
తత్త్వవాగమృతాంబుధారు లగుచు
మావంటి శుష్క-హృత్ మరుభూమివర్షించి
భక్తి సస్యశ్యామవంత మొంద
నిర్వ్యాజకరుణచే నిత్యమీవిధి విధా
నముగాగ వర్తించుక్రమము నరయ
స్వార్థవిరహితంబు పరజనోపకృతంబు
మూర్తీభవించిన పురుషవరులు

తే॥ గీ॥ గాగ దోచెడు పైరు పక్వంబునొంద
తనిసి ధాన్యభారంబున తలలువంచి
జోతలిడుమాడ్కి- మాదగు జోతమీకు
నర్పణంబు కృతజ్ఞతార్థంబు మీఱ.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

ఓం

# కొన్ని సూచనలు – సలహాలు.

1. భక్తియోగ విశేషసంచికను పాఠకులుచూచి చదివి యున్నారుగదా ! అందలి లోటుపాట్లను నిస్సంకోచముగ తెలుప ప్రార్థన. ఆ పద్ధతి నచ్చినది లేనిది తెల్పినచో బహుమతమును బట్టి మీాదటి సంవత్సరమునకు అనువగు మార్గము నేరు కొందుము.

2. ఆ గ్రంథమే విడిగ కొనువారి సౌలభ్యముకొరకు 'గీతోక్తభక్తియోగ' మనుపేర క్రౌను $\frac{1}{8}$ (వాచకముల) సైజులో ప్రత్యేకముగ ముద్రింపబడినది. కూర్పుతీర్పు రమ్యముగనున్నది. మెకానికల్ గ్లేజుకాగితములు వాడబడినవి. 120 పేజీల గ్రంథము వెల రూ. 1–0–0 మాత్రము.

3. గీతావాణి పత్రికలు చేరలేదనియు – పంపవలెననియు వ్రాసెడి ఫిర్యాదులు గీతావాణి మేనేజరుగారికి వ్రాయవలయునేకాని సంపాదకునకు వ్రాయపనిలేదు.

4. వ్యాసములనుకాని, సమీాక్షకై పంపు గ్రంథములు పత్రికలుగాని సంపాదకునిపేర ఆళ్లగడ్డకు పంపవలెను. పాత అలవాటుతో కోయిలకుంట్లకుగాని, బనారస్‌కుగాని పంపినచో సంపాదకుడు జవాబుదారీ వహింపడు.

— సంపాదకుడు,

గీతావాణి, ఆళ్లగడ్డపోస్టు (కర్నూలు.)

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు, జనవరి 1955 కా. 1000.